# భారతావని





*Lord, we are upon earth to accomplish Thy work of transformation. It is our sole will, our sole preoccupation. Grant that it may be also our sole occupation and that all our actions may help us towards this single goal.*

*THE MOTHER.*





*Earth is the chosen place of mightiest souls;*
*Earth is the heroic spirit's battlefield,......*

*I know that I can lift man's soul to God,*
*I know that he can bring the Immortal down ....*

*To raise the world to God in deathless Light,*
*To bring God down to the world on earth we came,*
*To change the earthly life to life divine.*

*(SAVITRI)* — *SRI AUROBINDO.*



# శ్రీ అరవిందాష్టక స్తోత్రం

అరవిందం దయాశాంతం, సర్వభూతోపకారకం ।
సర్వజ్ఞానప్రదం ధీరం తం, మునిం ప్రణమామ్యహం ।
అగ్నిసూక్తార్థ తత్త్వజ్ఞం, షడ్వర్గారి వివర్జితం ॥
అణిమాది గుణోపేతం, అరవిందం భజామ్యహం ।
రవితేజ సమాభాసం, సర్వతత్త్వ నిరూపిణం।
సర్వానంద నిధిం శాంతం, దేశికం తం నమామ్యహం ॥
రణత్కింకిణి నాదాఢ్యం, నౌళియోగ విభూషితం ।
నాదబిందు కళాతీతం. తం గురుం ప్రణమామ్యహం ॥
విశ్వాచార్యేతి ప్రథితం, గ్రంథిత్రయ విభేదకం !
గీతాగ్రంథ వివరణం, తం గురుం ప్రణమామ్యహం ॥
దాన్తాది గుణసంయుక్తం, షడధ్వాంత విరాజితం ।
కుమార పూజితం దేవం, అరవిందం భజామ్యహం ॥
షడ్దళ విభూషితం షట్పద్మైః ప్రాప్తవిదేహం ।
సహస్రారవిందాఖ్యం అరవిందంనతోఽస్మ్యహం ॥
పాండ్యాం శ్రీవిరాజమానం భవరోగ నివారణం ।
అఖిల భువనాధీశం అరవిందం భజామ్యహం ॥

(సేకరణ)



'......... A universal spiritual presence, a universal peace, a universal infinite delight has manifested, immanent, embracing, all-penetrating......By a continual sacrifice or offering, a sacrifice of adoration and aspiration, of works, of thought and knowledge, of the mounting flame of the Godward will that we build ourselves into the being of this infinite.'

— Sri Aurobindo

# భారతావని

—శ్రీ అరవిందులు

## దివ్యశక్తిస్వరూపిణి - భారతమాత

భారతమాత కేవలమొక మృణ్మయపాత్ర వంటిది కాదు. ఆమె దేవతామూర్తి; శక్తిస్వరూపిణి. అన్ని దేశములకు అట్టి దివ్యత్వము గలదు. అయ్యవి వానివాని ప్రత్యేక ఉనికికి తోడ్పడుచు, వానివాని ప్రత్యేకతను పోషించుకొనుచున్నవి. ఆ యా దేవతామూర్తుల ప్రాబల్యమునందున్న మానవులకన్ననూ, ఆ మూర్తులు యదార్థములైనవి: శాశ్వతములైనవి. మరియు ఆ మూర్తులు విశ్వచేతనాంశములగుటచే అవి ఉన్నతస్థానములకు చెంది యున్నవి. ఈ పృధివిపై మానవ చేతనకు తమ ప్రాబల్యమును ప్రయోగించీ వారిని రూపొందింప జేయుటయే యిచ్చట యీ పృధివిపై ఆ మూర్తుల యొక్క ఉనికి, కార్యక్రమమునై యున్నది. ఎవరు తన వ్యక్తిగత చేతన మాత్రమే దేశీయముగను, జాతీయముగను పనిచేయుచున్నటుల భావింతురో యీ కానుపించున దంతయు తమ నిర్మాణమేయని వూహింతురో వారు తదన్యములగు మహత్తర శక్తియో, విశ్వగతియో ఒకటున్నదనియు, ఆ శక్తి ప్రతి కార్యమునకును వెనుకనుండి పనిచేయుచున్నదనియు, వానినీ రూపొందించుచున్న దనియు తలంపకుండుట సర్వసహజము.

# భగవంతుని ఉన్నతజ్ఞాన ప్రసారమునకు భారతదేశం

ఎట్టి పరిస్థితులందైనను, యెంతటి అపాయములందైనను, ఉన్నత జ్ఞానమును — అధిక సంఖ్యాకులచేతనో లేక అల్ప సంఖ్యాకుల చేతనో — సర్వదా అతి సమర్థతతో పోషింపబడు నొక దేశమును భగవంతుడు తన కొరకై నియమించుకొనుచున్నాడు. ప్రస్తుతము యీ చాతుర్యుగమందట్టిది మన భారతదేశమే యైయున్నది. భగవంతుడు ఆ జ్ఞానమున లయమై పరిపూర్ణమైన తదనుభవానందమును పొంద సంకల్పించినపుడంతయు; అనగా ద్వంద్వముల, పోరాటముల, దుఃఖపూరితములైన కార్యకలాపముల యొక్కయు స్వార్థము, అసమర్థత, తామసిక, రజోగుణముల యొక్కయు — క్లుప్తముగ జెప్పవలయుననిన — కలికాలానుభవమును పొంద సంకల్పించి నపుడంతయు భగవంతుడు తన మాయచే భారత జ్ఞానము నావరింపజేసి, బలహీన పరచి, అణచివేయును. తన్మూలమున భారతమాత అంతర్ముఖియై, భగవంతుని లీలలయందు జోక్యము కలుగజేసికొనక యుండును. పునః తానీబురద లోనుండి పైకి రాదలచినపుడు నరునిలోని నారాయణుడు శక్తిమంతుడుగను వివేకి, జ్ఞాని, అనుగ్రహపూరితుడుగను కాదలచినపుడు మరల ఆ భగవంతుడే ఆ మాయను తొలగించి, తన జ్ఞానశక్తిని భారతదేశముపై ఆవరింపచేసి, అంతర్ముఖియైయున్న భారతమాతను పునః మేలుకొలుపుటచే, ఆమె సర్వ ప్రపంచమునకును ఆయా పరిస్థితుల కనువగు జ్ఞానమును, శక్తిని, స్వేచ్ఛను, స్వాతంత్ర్యమును ప్రసాదించును. భారతదేశమందు జ్ఞానము సంక్షిప్తమగు సమయమున యోగులందరు యీ ప్రపంచమునుండి ఏకాంతవాసమునకేగి వారివారి వ్యక్తిగత ముక్తికి, ఆనందములకు యోగము నాచరింతురు. మరియు అల్ప సంఖ్యాకులైన శిష్యులు ఏ వొకరిద్దరి కొరకో పాటుబడుచుందురు. కాని, మరల జ్ఞాన ప్రవృత్తి యెప్పుడు విస్తరించునో

అప్పుడు దానితోపాటు భారతదేశ ఆత్మకూడా వికసించును. ఆ తరుణమున యోగిపుంగవులందరు పునః యీ ప్రపంచమున, యీ దేశమునందవతరించి ప్రపంచముకొరకే కృషిచేయుచుందురు. మరల జనకుడు, అజాతశత్రువు, కార్తవీర్యులవంటి రాజయోగులవతరించి సింహాసనారూఢులై జాతిగమ్యమునే లక్ష్యముగగొని యీ ధరణి నేలుదురు.

## ఆధ్యాత్మిక భావనాశక్తి భారతమాత

ప్రతి దేశము ఒక శక్తిస్వరూపమో లేక ఆయా మానవులందుగల పరిణామాత్మక శక్తియో యై యుండుటచే ఆయా ముక్త స్వరూపములు వాని వాని మూల సూత్రముల ననుసరించి జీవించుచున్నవి. అందు హిందూదేశము భారతమాత శక్తిస్వరూపము; సజీవమైన గొప్ప ఆధ్యాత్మిక భావనా శక్తి, విశ్వసత్తయే ఆమెయొక్క ఉనికికి ప్రధానాలంబనము. కేవలము యీ సుశీలతవలననే ఆమె అమర జీవములైన దేశములందొకటిగ విరాజిల్లు చున్నది. ఈ సౌశీల్యమే ఆమె యొక్క అత్యద్భుత నిగ్రహాశక్తికిగల పరమ రహస్యము. ఆమెయొక్క పునరుద్ధరణకును, శాశ్వతత్వమునకును గల అమోఘశక్తి.

## అత్యద్భుతమైన సామర్థ్యముగల భారతజాతి

ఈ భారతజాతి ప్రకృతికర్మాగారమునుండి యిప్పుడే వెలువడినదియో అపరిపక్వ మైనదియో, నవనాగరికతా పద్ధతులందు నూతనమైనదియో, నవీన సృష్టియోగాని కాదు. భారతీయులు బహుసనాతనులు; ఈ పృథివిపై గొప్ప నాగరికతగల జాతులలోనివారు. ఈ భారతజాతి బ్రహ్మాండమైన జీవశక్తి

గలది. బహుముఖ ఫలప్రదమైన గొప్పతనముగలది. గంభీరమైన చరిత్ర గలది; అత్యద్భుతమైన సామర్థ్యము గలదియును కూడ. ఈ భారతదేశమ విదేశీయుల శ్రమఫలితముగ, వివిధరూపములైన శక్తిని, తదితర మానవు నాగరికతను తనయందిముడ్చుకొని స్వశక్తి నుత్తేజింప. ఉన్నతస్థాన మ ష్టించుటకై నియమబద్ధముగ జాతీయైక్యతతో ఇప్పుడిప్పుడే పైకి లేచుచున్నది

## ఆధ్యాత్మిక శక్తివంతులవారసులు భారతీయులు

మనము సాధారణమైన సంతతికి జెందినవారముకాము. మన పర్వ రాజములవలె, భాగ్యవంతములైన నదులవలె బహుసనాతన సంతతివారలము మన వెనుక మన పూర్వీకులు సాటిలేనట్టి అనేకములైన గొప్పచరిత్రల గలిగియున్నారు. ఆధ్యాత్మిక శక్తిని గడింప, అతి విషమ పరిస్థితులం మానవజాతి యెంతటి దారుణములైన కష్టముల ననుభవింపవలసి యున్న అట్టి భయంకరములైన కష్టములనన్నిటిని తా మనుభవించి, మహో క నియమములకు గురియైయుండిరో, అట్టి మహనీయులకు వారసులము మన పరలోకమున కేగు తమ భర్తల ననుసరింప భక్తితో, చిరునవ్వులతో స గమన మాచరించిన పతివ్రతామ తల్లులకు బిడ్డలము మనము. ఎంతటి భౌ శక్తినైనను ధిక్కరించగల ఆధ్యాత్మికశక్తిగల వారలము మనము. ఎంత కష్టములనైన భరించగల సమర్థులము మనము. భగవదావిర్భావమునకై వంతునిచే యెంచుకొనబడిన ప్రజలము మనము. అత్యవసరములైన స యములందంతయు ఎన్నియో పర్యాయములు భగవంతుడు మనమధ్య అ రించినట్లు మన చరిత్ర తెలుపుచున్నది. భగవదావిర్భావమునకై భగవంతుని నియమింపబడిన వారల మగుటచే మన హృదయములో భగవంతుడు ని యున్నాడు. రేపటి సూర్యోదయ మెంతటి తథ్యమో మన భారతదేశ

పునఃప్రకాశించుట అంతటి యదార్థమైనది, స్పష్టమైనదియునుకూడ.

## వీరులు, యోగులు, ఋషులు: భారతభూమి పంట

బహు సనాతన మైనదియు, గొప్పదియునైన యీ భారతావనియొక్క గత ప్రభావములను, కీర్తిని ముందిడుకొని అనేకులు సనాతన ఋషులవలె, భావి, నాగరికతగల ప్రేరణకర్తలవలె, ప్రస్తుత మన యీ దుస్థితియందు, క్షీణించుచున్న యీ మానవ సముదాయముల మధ్య, అత్యద్భుత శక్తి పరాక్రమములు ప్రదర్శించియున్నట్టి ఆకాలపు చరిత్రలను పునరుచ్చరింపరాదను అనుచిత భావములను వెల్లడించుచున్నారు. అది తప్పు; ముమ్మాటికిని తప్పు. శాశ్వతమైనది భారతభూమి; బహు సనాతనులు భారత ప్రజలు. అనాదియైనది మన మతము; మనశక్తి, గొప్పదనము, పవిత్రత మేఘావృతములైనవేగాని యెట్టి పరిస్థితులందైనను ఒక్క క్షణమైనను పూర్తిగ అంతరించియుండలేదు. వీరులు, యోగులు, ఋషులు యీ భారతభూమికి సహజములైన ఫలములు. ఈ యోగపురుషులు జన్మించని కాలమేలేదు.

## మానవాభ్యుదయము కొరకు భారత జ్యోతి

మనము తఱచు సనాతనధర్మమైన హిందూమతమును గురించి మాటలాడుచుందుమేగాని మనలో బహుకొలది మందికి మాత్రమే అ మతమనగా నేమో తెలియును. తదితర మతములన్ననో — ప్రబలమైన యొక వృత్తిగనో, లేదా విశ్వాసముతో కూడినవిగనో యున్నవి. కాని మన సనాతన ధర్మము సజీవమైనది, అయ్యది స్వానుభవముచే పొందదగినదేగాని మాటలచే నమ్మింపదగినదిగాదు. ప్రత్యేకముగనున్న యీ ద్వీపకల్పమునందు మాన

వులకు మోక్షదాయినియైన యీ సనాతన ధర్మము తరతరములనుండి పోషిం పబడుచున్నది. ఈ ధర్మమును బోధించుటకే భారతమాత పైకి లేచుచున్నది. భారతదేశము యితర దేశములవలె స్వార్థముకొరకో లేక బలహీనముగా నున్న యిరుగు పొరుగు దేశములపై దండెత్తి ఆదేశములను అణగద్రొక్కు టకొరకో పైకిలేచుటలేదు. భారతమాతకు అప్పగింపబడిన నిత్యజ్యోతిని సర్వవ్యాప్తముగ ప్రసరింపజేయుటకొరకే ఆమె అభివృద్ధి గాంచుచున్నది. స్వార్థరహితయైన యీ భారతమాత కేవలము మానవాభ్యుదయము కొరకే జీవించుచున్నది. అందులకే ఆమె అన్ని విధముల గొప్పది కావలసిన అవ సరమున్నూ యేర్పడినది.

## దివ్యజ్యోతి రక్షణకొరకు భారతదేశము

భారతదేశమున కిదియొక గొప్ప పరీక్షాసమయము. ఏమన; తన ధర్మ మును వీడి, ఆత్మను చంపుకొని, మనోవికార హేతువులగు కొన్ని మార్గ ముల ననుసరించుటవలన సంపన్నమైన పరిశ్రమలతోను, వర్తక వ్యాపార ముల అభివృద్ధిగాంచుచు తదితర దేశములవలె కృతకమైన గంభీరత్వముతో తాను అభివృద్ధిజెందినను, శక్తిమంతమైన రాజకీయ, సాంఘిక నిర్మాణ జీవి తమును నిర్మించుకొనిననూ, అపారమైన సైనికశక్తిని యేర్పరచు కొనిననూ గొప్పరాజకీయ తంత్రముల ప్రదర్శించిననూ, తన అదాయములందును, వా‹ ఫలయందును తగు జాగ్రత్తగలిగి పట్టుదలతో వానిని విస్తరింప జేసికొ‹ ననూ, మఱియు అత్యధిక భూభాగముపై తన ప్రభావమును చెలాయించినన చెలాయింపవచ్చును. కాని, ప్రతీయమానమైన (అశాశ్వతములైన) యి విశేషాభివృద్ధి పొందిననూ అయ్యది తన స్వధర్మమునకు మహాపరాధ వే యగును. అంతియేగాక, సనాతన భారతావని, తదాధ్యాత్మిక స్వరూపము‹

నిరంతరముగ అదృశ్యముగావచ్చును. అందుచే తనకుగాని, తదితర జగత్తు నకుగాని యెట్టి ప్రయోజనము లేకపోవుటయేగాక తదితర దేశములతోబాటు తానొకటియైయుండును. ఒక ప్రశ్న: అత్యంత సంపన్నమైన, శాశ్వతమైన ఆధ్యాత్మికతానుభవమును, తదాత్మజ్ఞానమును సంపూర్ణముగ వదులుకొని యీ బాహ్యజీవనమునందు నిరపాయముగ వర్ధిల్లవచ్చునేమోగాని మిగత భూమండలమంతయు ఆధ్యాత్మిక సహాయముకొఱకు, ఆ దివ్యజ్యోతి రక్షణకొఱకు అధికాధికముగ తనవైపు దృష్టిని మరల్చుచున్న యిట్టి తరుణమున భారత దేశము తన పిత్రార్జితమైన ఆధ్యాత్మికతను వదలుకొనుట పరిహాసాస్పదము; కేవలమది దురదృష్టమనియే చెప్పవచ్చును. ఇయ్యది సంభవింపరాదు. నిశ్చయముగ సంభవింపదుకూడ. అటులని ఆ అపాయములేదని చెప్పజాలము. ఈ దినమో లేక మరుదినమో భారతదేశము యెదుర్కొనవలసిన తదితరములైన కఠిన సమస్యలెన్నియోగలవు. అయినను వాని నన్నిటిని తప్పక జయించగలమనుటలో యెంతమాత్రము సందేహములేదు.

## ఆత్మయొక్క సత్యాన్వేషణయే భారతీయ జీవన సంకల్పము:

భారతదేశ దృక్పథమునందుగల విశిష్టత యేమన: ప్రతి ఆకారమునకును వాని చేష్టలకునుగల ఆంతరంగిక హేతువును, అందుల కాధారభూతమైన శక్తిని, తదాత్మను, ప్రతిదానియందును వెదకుటయే. భారతీయ జీవన సంకల్పమునందుగల మరొక ముఖ్య అంశమేమన: ఆత్మయొక్క సత్యమును కనుగొనజాలని యెడల, అద్దానియందే జీవించని పక్షమున, తనకు తాను అసంపూర్ణమైనటుల భావించును; అపరిపక్వమైనటుల తలంచును

# నవీన రూపములో సనాతన ధర్మము:
## ఐక్యతా జీవిత అవతరణ

విజయవంతమైన ఐక్యతా జీవిత అవతరణకు ఆధ్యాత్మిక భావసూచనలే చివరి మార్గమైన యెడల భారతదేశము తన ధర్మమును వీడకుండుటయే శ్రేష్టము. నిరంతరమైనదియు, సత్యమైనదియు నైన ఆమెయొక్క ప్రకృతికి అన్యములైన—బహుశా తక్షణము ఆచరింపగలిగినవే యైనను—నిమ్నతర భావములకు, ప్రత్యామ్నాయముగ తా నేర్చిన మహోన్నతాశయముల వీడుట సమంజసముకాదు. ఈ మహోన్నతాశయములను ప్రత్యక్షముగ ననుభవింప గొప్ప సామాజిక ప్రయత్నము అత్యంత అవసరమైయున్నది, మఱియు అయ్యవి తాత్కాలికముగ యెంత అసంపూర్ణముగ గోచరించుచున్నను, ఎంత హీనదశయందు పడిపోయినను, మన ప్రయత్నము నాపక, నిశ్చయమైన పట్టుదలతోను, అచంచలమైన నమ్మకముతోను కొనసాగించుచునే యుండవలయును. భారతమాత తనశక్తిని తాను పొందగలదు. మరల తన ప్రతిబింబమును విస్తరింపజేసికొనగలదు. ఆత్మ ఐహికరూపములచే బంధింపబడునదికాదు. అది నిత్యనూతనమైనది, నశింపనిది, ఆద్యంతములు లేనిదిగనుక హిందూసనాతన ధర్మమునకు నవీనరూప మొసంగవలయును. అట్టి రూపము పాశ్చాత్యుల నిబంధనలచే మారునదిగ యుండరాదు. అప్పుడే, అయ్యదియే సేవచేయుటకును, మానవాభ్యుదయము నధిగపరచుటకును శ్రేష్టమైన మార్గము.

## సృజనాత్మకమగు సమానత్వము

భారతమాత ఆత్మకు యెట్టి గౌరవము లభించినను, మన అవసరము

లకు యెట్టి ప్రత్యుత్తర మందిననూ మనము ముఖ్యముగ సృజనాత్మకమగు సమానత్వమును నిర్మించుకొనుట అవసరము.

ఒకరిని అనుకరించుట, అనాగరిక ఋణములను స్వేచ్ఛగ నందుకొనుట వలన నయ్యవి తాత్కాలికముగ సహాయకారిగా యున్నను, విజయమునకు పరమ విరుద్ధములైన కార్యములని గ్రహింపవలయును. అట్టి అనుచిత సహకారముల నట్లే వినియోగించుకొనుటకు బదులు ముఖ్యముగ వానికి భారతీయాత్మను, విజయవంతమైన సమానత్వముల పొందిక నమర్చుట చాలా అవసరమైనదిగ గ్రహింపవలయును.

## జగత్తునందు భారతదేశ కర్తవ్యము

భారతదేశ ప్రకృతి, మతము, తాను నెరవేర్చవలసిన కార్యము యీ జగత్తునందు నిర్ణయింపబడిన ఆమె కర్తవ్యము, ఆమె ప్రతిభాసమానమై నిలిచి యున్న ఆ అసాధారణ శక్తి మొదలగునవన్నియు ఆమె గత చరిత్రయందిదివరకే వ్రాసియున్నవి. ప్రస్తుతము ఆమె అనుభవించుచున్న బాధలకును, అగ్ని పరీక్షలకును వెనుక నొక రహస్య హేతువు గలదు. మన ఆత్మయొక్క సంకల్పము పునః రూపము దాల్చ వలయును, అనగా పురాతన రూపములకు వెనుకనున్న ఆత్మనే ప్రత్యేకమైన, నూతనమైన, శక్తివంతమైన భావార్థ సూచనలతోను సంస్కృతీ విలువలతోను, నవీన సాధకులతోను, గొప్ప రూపములతోను భద్రపరచవలయును. అత్యంత ప్రధానములైన యీ విషయములను గుర్తించియున్నంతవరకు, వాని యాత్మకు విశ్వాసపాత్రులమై యున్నంతవరకు; మానసిక, భౌతిక సంధానము లెంతటి కఠినములైనను— సంస్కృతీ సాంఘికములందపరిమిత మార్పు లేర్పడినను మనము బాధపడ

ప్రస్తుతము భారతమాత లక్ష్యము.

## ఆత్మస్థితి అభివ్యక్తమే "సన్మార్గము"

పాశ్చాత్యుల మనస్తత్వమునకు "సన్మార్గము" నగా బాహ్యప్రవర్తన యనియే భావము. కాని, భారతీయ మనస్తత్వమునకు ఆ "సన్మార్గము" ఆత్మస్థితియొక్క సూచనను వ్యక్తపరచునట్టి వొక సాధనము మాత్రమే.

పాశ్చాత్య నీతిబోధకులు అఖండత్వముయొక్క ప్రతినిధులవలె గొప్ప స్థితియందున్నట్లు తలంతురేగాని. వారొసంగు నీతిబోధ భిన్నమైనదేయైనను అధికముగ గౌరవింపబడిన యెడల, ఆచరణతో వారి కంతగ నిమిత్తము లేదు. తరచు హైందవ నీతిబోధకులు వారికన్న ఉన్నతస్థితియందే యుండెదరు. కాని, వీరికి బహిరంగ బోధలకన్న జీవిత సత్యములే ప్రధానములైనవి. ఆ మహోన్నత నీతిభావములను ఆచరణ యోగ్యములుగ జేయజాలని వారలు ప్రాథమిక స్థితులయందు సాధ్యమైనంత సన్మార్గప్రవర్తకులగుటచే క్రమక్రమముగ అభివృద్ధి గాంచెదరు.

## ఋషుల మార్గదర్శకత్వములో వ్యావహారిక జీవనము

సామాన్యముగ ఐరోపావాసి, తన మార్గదర్శక భావములను ఆత్మవిద్యనుండి పొందక భావాత్మక. వ్యావహారిక హేతువులద్వారా గ్రహించుచుండును. భారతీయ మనస్తత్వమిందులకు ప్రతిపక్షమార్గము ననుసరించును. అనగా ఋషి, దీర్ఘదర్శి, ఆధ్యాత్మిక సత్యములందు ద్రష్ట మొదలగువారి

మార్గదర్శకత్వము మతమందును, జ్ఞానబోధయందును మాత్రమే ఉత్తమో త్తమమైనదిగ గాక, వ్యావహారిక జీవనమందును కూడ అత్యంత శ్రేష్ఠమైన దిగ విశ్వసించును.

## మానవాళి ఉనికికి అత్యంత ప్రధానం ఆత్మసత్యములే

హైందవులు ఆత్మయొక్క సత్యములే పరమ సత్యములుగను, ఆ పరమ సత్యములే మన ఉనికికి అత్యంత ప్రధానములైన, ఉపయుక్తము లైన సత్యములుగను, మరియు శక్తివంతమైన అంతర్భావమును సృజించు నవిగను, బాహ్యజీవన సంస్కరణను, శ్రేయస్కర మైనదిగ జేయగలుగు సత్యములుగను దృఢముగ నమ్ముచున్నారు. కాని ఐరోపావాసులు కేవలము మానసిక, బుద్ధికుశలతలుగల హేతురూపములైన సత్యములనే పరమసత్య ములని నమ్ముచున్నారు.

## యంత్రప్రాయ ఐక్యత వైఫల్యం

ఐరోపా కర్మయోగులు బహుప్రయాస ఫలితముగ పరస్పర భిన్న భావములతో కూడిన యంత్రప్రాయమగు స్థాపనా శక్తిచే నొక విధమగు ఐక్యతను కల్పించుకొందురు. అట్టి స్థాపనములు కొలది కాలమునకే తిరో హితములై పేరునకు కూడ గానుపింపక అంతరించుచున్నవి.

## ప్రపంచమంతయూ భారత భానుని దివ్యకాంతులు

ప్రతి సంభవము, ప్రతి కష్టము, ప్రతి అపజయముకూడ భారత

వలసిన పనిలేదు. కాని ఆమార్పులు భారతదేశ ఆత్మనే కరగి, పోతబోసిన రూపములో యను నట్లుండవలయునేగాని, తదన్యములైన యే అమెరికా, జపాను, రష్యారూపములుగనో లేక పశ్చిమదేశీయరూపములుగనో యుండరాదు. ప్రస్తుత మన స్థితియేమి; మన మెట్టి స్థితియందుండ వచ్చును; యెటులుండుటకు ప్రయత్నించిన యుక్తము – అను యీ విషయములకు మధ్యగల అగాధముల వంటి తారతమ్యములను మనము గుర్తింపవలయును. మనము పొందనున్న అభివృద్ధియొక్క పరిమాణము ఆత్మయొక్క సత్యముతో కూడినదేగాని, యెట్టి నిరుత్సాహకరమైన శక్తితోనో, విరక్తితో కూడినదోగాని కారాదు. అందుచే వాని సత్యమైన మార్గము తెలిసికొన మనయందు ఆకాంక్షను, అను ప్రేరణను, శక్తిని నిర్మించుకొన వలయును.

## అంతరాత్మ నాయకత్వంలో బాహ్యప్రకృతి: భారతమాత లక్ష్యం

సహజముగ పాశ్చాత్యుల మనస్తత్వము, వారియొక్క ఉన్ముఖత తలక్రిందులుగా యుండును. వారి భావములు జడాత్మక, ప్రాణాత్మకములందు గట్టి పునాదు లేర్పరచుకొని, సహజమైన యీ లోక జీవితమందు కొంత భాగమును సవరించుకొన సంకల్పించి ఉచ్చశక్తులను ప్రార్థింప, ఆ శక్తులట్లే సహజమైన యీ భౌతిక జీవితమును మాత్రమే సవరింప సమ్మతించినవి. అందుచే వారి అంతః స్థితి బాహ్యశక్తులచే రూపొందింపబడి, పాలింపబడు చున్నది. కాని భారతదేశముయొక్క నిరంతర లక్ష్యము అందులకు విరుద్ధమైనది. మన అంతరాత్మయే బాహ్యజీవితమును నడుపుచున్నది. భవిష్యత్తు ననో యీ మనస్సు, ప్రాణము, దేహములు—తమ మార్గముల నధిగమించి బాహ్యప్రకృతికే నాయకత్వము వహించి ఆజ్ఞాపించునటుల జేయుటయే

మాతను విధిగా మేలుకొలిపి ఉన్నత స్థానమలంకరింప జేయుటకే తోడ్పడు చున్నవనియు అప్పుడు మన కష్టములన్నియు తీరుననియు భారతీయులు దృఢముగ నమ్మవలయును. భారతదేశము పతనమగు కాలమంతరించిన దనియు, ఉపరితలము నందుకొను సూచనలు గోచరించుచున్నవనియు గ్రహింప వలయును. ప్రాతఃకాలము మనకు అతి సమీపమున నున్నది. ఒక్కసారి ఆ వెలుగు ప్రకాశించెనేని పునర్నిశయను పదమునకే స్థానముండదు. అరు ణోదయకాలము అతి శీఘ్రముగనే రానున్నది. ఈ క్షితిజముపై భారత భాస్కరుడుదయింప నున్నాడు. భారతమాతయొక్క అదృష్ట భాస్కరుడుద యించి. తన దివ్యకాంతులచే భారతావని నంతను దేదీప్యమానముగ ప్రకా శింపజేయును. ఆ దివ్యకాంతులు భారత దేశమును నింపి, పొంగి పొరలి ఆశియాఖండమంతయు వ్యాపించును. తద్విధముననే యీ ప్రపంచమంతయు ఆ దివ్య కాంతులచే ప్రకాశించును.

## ఆధ్యాత్మిక ధర్మము - భారతదేశ ప్రసాదము

ప్రపంచమునకు భారతదేశము ప్రసాదింపనున్న ఆధ్యాత్మిక ధర్మ మప్పుడే ప్రారంభమైనది. భారతీయ ఆధ్యాత్మికత అమెరికా, ఐరోపా దేశ ములకు నిరంతరాభివృద్ధికర పరిమాణముల విస్తరించుచున్నది. ఈ కార్యము ప్రస్తుత విపత్తులయందును కూడ — దిన దినాభివృద్ధి జెందుచునే యున్నది. ప్రపంచదృష్టి గొప్ప ఆశాభావములతో క్రమక్రమముగ భారతదేశమువైపు మరలుచున్నది. అయ్యవి కేవలము భారతమాత దివ్య సందేశమునకేగాక ఆమెయొక్క ఆధ్యాత్మిక సాధనా విధానములచే విరివిగ ఆకర్షింప బడుచున్నవి.

## భారతతపస్సు: ఆత్మపరిపూర్ణత

తాపసిక అంశము ఏ కొంచమయినను లేనిదే యేదియు విశేషించి పూర్ణపరిజ్ఞానము కానేరదు. తాపసత్వ మనగా; మానవుడు స్వార్థరహితుడై, తనను తాను జయించుకొని, నిమ్నతర చిత్తస్పందనల నెల్ల అణచివైచి తన స్వభావములందు ఉన్నత స్థితుల నందుకొనుటయే. భారతీయ తాపసత్వము దుఃఖకరమైనదియో, బాధాకరమైనదియో, శుష్కింపజేయునదియో, వ్యాధిగ్రస్తమైన ప్రాయశ్చిత్తమో, అత్యంత విచారకరమైనదియో గాని కాదు. కాని అయ్యది సచ్చిదానందమును జేర, ఆత్మను పరిపూర్ణముగ స్వాధీనపఱచుకొనుటకై జేయు గంభీరమైన ప్రయత్నము మాత్రమే. ఆ అనుభవ ఆంతర్యమునందు ఆత్మ విజయము యొక్క ఆనందము, ఆంతరంగిక శాంతి, ఆనందము, పరమతమ స్వాతిక్రమణ యొక్క మహదానందములును గలవు. అయితే, కండరములతో మత్తెక్కునటుల జేయుటకును, బాహ్య జీవితమందు వ్యామోహమును అధికపఱచుటకును పూర్తిగా యీ మనస్సే కారణము. ఈ మనస్సు, అస్థిరములైన వాంఛలతో సంతృప్తిజెందుటకై నిర్విరామముగ ప్రయత్నించు చున్నది. అంతేగాదు, యీ మనస్సు తాపసిక ప్రయత్నము యొక్క ఆదర్శ ఔన్నత్యములను, తద్గంభీరతను కూడ నిరాకరించు చున్నది.

## ఆధ్యాత్మికత: పూర్ణ మానవత్వము

వైరాగ్యము – మాయావాదములు అంతప్రాముఖ్యములైన విషయములు కావు. కాని, భారతీయ ఆధ్యాత్మికత; దాని యొక్క మహోన్నత దశలయందునను, అత్యంత ఆంతరంగిక సాంకేతములందునను కూడ—బహు ప్రయాసతో కూడిన అచలత్వమో, సాంప్రదాయకమైన సన్యాసమో గాని

కాదనునదియే ముఖ్యమైన విషయము. కాని, మానవ సత్తా; వాంఛలతో కూడిన జీవితమునకును, ప్రాణమయ Vital life జీవిత సంతృప్తికిని అతీత మైనది; — ఆధ్యాత్మిక నిశ్చలత్వము యొక్క ఉత్కృష్ట స్థితికిని; గొప్పదనము శక్తి వెలుగునకును; భగవత్సాక్షాత్కారము, నిరంతర శాంతి, బ్రహ్మానంద ములు జేరుటకై తీవ్రమయిన ప్రయత్నములు జేసినది. భారతీయ పరిజ్ఞాన మునకును, చలనత్వముతో కూడిన నవీన భావములందుగల గొప్ప లౌకిక ములకును మధ్యగల ప్రశ్న: మానవుని ఔన్నత్యమునకు, పూర్ణత్వమునకు; బ్రహ్మాండమయిన యీ ప్రయత్నము అంత ముఖ్యమైనదా. కాదా? యనునది. ఈ ప్రయత్నముఅవసరమే యైనచో అపూర్వులైన మహనీయులు ఏ కొలది మందికి మాత్రమే ఆ ప్రత్యేక శక్తి యుండవలయునా, లేక, శ్రేష్టమయిన అద్దానిని యీ సమస్త మానవ సంస్కృతికి నంతటికిని అనుప్రేరణతో కూడిన కారణ శక్తిగ జేయుటయా? యను మరొక ప్రశ్న వుత్పన్నమగు చున్నది.

భారతీయ పరిజ్ఞానము మానవుని యందుగల భౌతిక పూర్వాక్రమణ ముకన్ననూ అతీతమయినదానికే అత్యంత ప్రాధాన్యత నొసంగుచున్నది. ఆ పరాత్పరునే తన లక్ష్యముగను, బహు ప్రయాసతో కూడిన యీ మానవ ప్రయత్నమునకు ఆత్మవిస్తృతియే శిఖరముగ నెంచుకొనినది. ఆధ్యాత్మిక జీవితము, దానియొక్క స్థితులయందు; బాహ్యసంపద, జీవిత భోగభాగ్యముల కన్నను ఉన్నతమైనది, క్రియాపరునకన్న జ్ఞాని ఉత్తముడు, ఆధ్యాత్మిక పురుషుడు జ్ఞానికన్న అత్యంత శ్రేష్టుడు, అట్లే, బాహ్యమయిన మనస్సుచే భోగవాంఛలనే కోరుచు, తలంచుచు, యీ జీవిత పదార్ధములందే యుండెడి ఆత్మకన్న ఆ భగవంతునియందే వసించు ఆత్మ అత్యంత పరిపూర్ణమయినది, శ్రేష్టమయినదే గదా!

# చరాచరజగత్తు - ఆత్మక్రమ వికాసము

ఈ సనాతన జ్ఞానమునకు అంతరంగిక పరిశోధన, మనోవిజ్ఞానము— ఇయ్యవి, అత్యంత గూఢమయిన చైత్య శాస్త్రములకన్ననూ, భారతదేశ ప్రత్యేక శక్తియగు భౌతిక జ్ఞానమునకన్ననూ మిన్నగ మానసిక పరిశీలన యందును, అంతరంగిక శక్తుల పరిశీలనయందును మహోన్నత శక్తిని సాధించగలిగి యున్నందున, నయ్యవి యదార్థమైన ప్రకృతి పరిశీలనకు ప్రాతిపదికగ నున్నవి. ఆమె వెదకుచున్న ఆధ్యాత్మిక సత్య మియ్యదియే యగుటచే అద్దానిని అనుష్టింపనిచో నయ్యది యదార్థమయిన, సహిష్ణువైన తత్వశాస్త్ర మెట్లగును? మఱియు యీ మూలమునగాక తదితరములచే నయ్యది సాధ్య మగునా! భారతీయ పరిజ్ఞానము; తత్వశాస్త్రములకును, మతము, మనోవిజ్ఞాన సత్యములకును మధ్య సమానత్వమును స్థాపించినవనుట యదార్థమేగాని స్థూలప్రకృతియొక్క సత్యములను తద్దైకపరిమాణమున విస్తరింపజేయలేదు. ఏలనన, ఆ తరుణమున యీ భౌతిక శాస్త్రము విశేషించి విశ్వవ్యాప్తియై యున్నది కాదు. అందుచే, అట్టి సమన్వయము(ఆధ్యాత్మికము-భౌతికము)ను పూర్తిగా సాధ్యమగునటుల ఇప్పుడు జేయుచున్నారు. ప్రారంభము నుండియు, అనగా, వేదాధ్యయనమాదిగ ఆధ్యాత్మికత యందును, మనో విజ్ఞానమునందును, ప్రకృతియొక్క ఉనికి నందునను; సర్వసహజ నిబంధనలు, వాని శక్తులను ఒకేరీతి యైనవిగ భారతీయులు గుర్తించియుండిరి. జీవితము సర్వవ్యాప్తమయినదిగ కూడ భారతీయులు నెఱింగి యుండిరి. మఱియు ప్రకృతినుండి వృక్షాదులు; పశువు మొదలు మానవాకారము వరకునూ ఆత్మ క్రమ వికాసము నొందుచున్నదని రూఢి పఱచిరి. దానినే తత్వ శాస్త్రసంభోదన, ఆధ్యాత్మికత, మనోవిజ్ఞానానుభవములచే స్థిరపఱచిరి. అట్టివి అనేకములైన సత్యములను ఈనాడు యీ నవీనశాస్త్ర పరిశోధన తన

స్వంత మార్గములద్వారా మరల వానినే బలపఱచు చున్నది. ఈ విషయములు ఫలరహితమయిన, శూన్యమయిన దార్శనీక శాస్త్ర ఫలమో లేక, పశుతుల్య భావములందు ఏకాగ్రతకతంబున నిమ్నతర స్వప్నములగాంచు వారల నూతన కల్పనయోగాని కాదు.

★ ★ ★

ప్రపంచ చరిత్రలో,
శ్రీ అరవిందుల పాత్ర —
దివ్య జ్ఞాన ప్రబోధం కాదు,
బ్రహ్మవిద్యా రహస్యాన్ని బహిర్గతం చేయడము కాదు,
అది సాక్షాత్తు భగవంతుని ప్రత్యక్ష కార్యాచరణ శక్తియే.

# జాతీయనిర్మాణము - పునాది బ్రహ్మతేజస్సు, శక్తి:

బ్రహ్మతేజస్సు విధ్వంసమగుటవలననే క్షాత్రధర్మము, వైశ్యధర్మము. శూద్రధర్మము సర్వము లుప్తమైనవి

* * *

ఏదో హైందవత్వమను గ్రుడ్డియభిమానమే కొంత గలదుగాని దాని లక్ష్యలక్షణములు బూర్తిగా దెలియవు. మన పూర్వస్థితిని దలపోసి ప్రస్తుత స్థితిని గుర్తించి భావిస్థితి నూహించవలసి యున్నది.

* * *

మన జాతీయత మత విజ్ఞానైశ్వర్యము నానారూపముల విలసిల్లినది. అన్నిమతముల, మతోద్ధారకుల, ధర్మానుష్ఠానముల సమన్వయమొనర్చి యందలి జీవ రహస్యమును గుర్తించి యుత్తేజమునందవలసి యున్నది.

* * *

సత్యయుగమునకు బునాది బ్రహ్మతేజస్సు. బ్రహ్మతేజస్సే అన్నిటి కంటె ముఖ్యము నావశ్యకమై యున్నది. బ్రహ్మతేజస్సు ఆధ్యాత్మికము, శక్తిస్వరూపము సారనంతము. ఈశ్వరేచ్ఛాను గుణముగా నేకార్యమునకేని దానిని వినియోగించనగును. అది జాతియనిర్మాణమునకు నుపయోగపడును. అది అంతఃస్థితముగా నీశ్వర శక్తిగా నతీతమానవ ప్రజ్ఞగా బనిచేయ గలదు.

* * *

పాశ్చాత్యులు మతమును నిత్యజీవితమునుండి విడదీసి విజయవంతుల మైతిమని మురియుచున్నారు. "మతము దాని స్థానములోనే యున్నంతవరకు మంచిదే. కాని రాజకీయములలో శాస్త్రపరిశోధనలలో వ్యాపారవిషయములలో మతసంబంధ ముండరాదు. దాని సంబంధము నష్టదాయకము." ఇది వారి తర్కము.

## నిత్యజీవిత ధర్మము-యోగానుష్ఠానము

యథార్థమతము, పారమార్థికము, అధ్యాత్మిక లక్ష్యము, పరోపకారము, సత్యసాధనము, ఆత్మార్పణము, ఆత్మ శుద్ధికై పరితాపము వీనిన్నింటిని మానవ సంఘము విధ్యుక్తముగా గాంక్షించవలసినదే. ఏమైనను భగవంతు డుండుట నిజము.

నిత్యానుష్టానమందు లేని ధర్మము నిరుపయోగము. ధర్మమార్గమును గ్రహించుట, దాని సత్యమును గ్రహించుట, దాని మహోన్నతభావము నుపలభ్య మొనర్చుకొని నిత్యజీవనమున బహిర్గతము గావించుట, ఇదియే కర్మయోగము. ఈ యోగమునే మానవ జీవితాదర్శముగ జేయుటకు భారతదేశము వర్ధిల్లుచున్నదని మా విశ్వాసము. ఈ యోగమువలననే భారతదేశము తన స్వాతంత్ర్యమును, అన్యోన్యైకమత్యమును, ఔన్నత్యమును బొందుటకు వలయు శక్తిని సముపార్జింపగలదు. మేము కాంక్షించునది యాధ్యాత్మిక పరివర్తనము. భౌతికము దాని ఛాయ, ప్రతిఫలము మాత్రమే.

## ఆత్మసామ్రాజ్యం-మానవ సమస్యల పరిష్కారం

మానవకోటి కొఱకే భారతదేశము పునర్నిర్మాణమునకు గడంగ వలయునని మా సంకల్పము. మే మామోదించి యనుష్ఠించు జాతీయవాద తత్త్వమే యది. భోగలాలసములకూడిగము చేయునట్లు భౌతికశక్తులను లొంగదీసి వశపఱచు కొనుటవలన గాక మనలో నాత్మ సామ్రాజ్యమును స్థాపించి మన మేధాశక్తులను ఆత్మశక్తులను వశపఱచుకొని బాహ్యాంతరములందు మానవ స్వాతంత్ర్యమును నిరూపించుటవలననే. బాహ్యప్రకృతిని మనలో

జయించుటవలననే, నేడు మానవుని పీడించు విషమ సమస్యలు పరిష్కృత ములు కాగలవు.

భరతఖండ మొనర్పవలసిన కార్యము మహత్తైనకార్యము. అది ప్రపంచ కార్యము, భగవానుని కార్యము. భారతీయులగు బాలికా బాలకులారా! మీ రీ సత్యమును గ్రహించి మీ ధర్మమును నిర్వహించవలసియున్నది. పాశ్చాత్యానుకరణమువలన ఈ సద్ధర్మ నిర్వహణమునకువలయు శక్తిని మీరు సము పార్జింపజాలరు. భౌతికశక్తి మీకు శూన్యము. మీ కున్నదంతయు నాధ్యాత్మిక శక్తియే; కావున ప్రప్రథమమున భారతీయులు గండు. మీ పూర్వీకుల శక్తి సామార్ధ్యములను సంపాదింపుడు. ఆర్యభావమును, ఆర్యశిక్షణమును, ఆర్య వర్తనమును, ఆర్యజీవనమును సముపార్జింపుడు వేదాంతరహస్యమును, గీతా రహస్యమును, యోగరహస్యమును వీనిని మనసా సిద్ధాంతరూపమున గాక అంతఃస్థితముగా గ్రహించి నిత్యానుష్ఠానమునకు గొనితెండు.

ఆత్మబలమును మించగల బలము మరొక్కటిలేదు. ఆ బలము సనా తనము; మీయం దంతఃస్థితమై నిత్యమై యున్నది. దానిమూలమున, భౌతిక సామ్రాజ్యమును స్థాపించుటకు ముందు మీరు ఆత్మసామ్రాజ్యమును స్థాపింప వలయును.

## జగం... ఆద్యప్రకృతి సృష్టి:

విజయమునకు కారణము శక్తి. ఏ శక్తివలన దుర్బల పక్షమునకు జయము కల్గుచున్నది? మరియు ప్రబల పక్షముయొక్క శక్తి పరాజితమై నశించిపోవుచున్నది? ఐతిహాసిక దృష్టాంతముల నన్నింటిని మనము పరీక్షిం

చినచో "ఆధ్యాత్మిక శక్తియొక్క బలముచే ఈ అఘటనాఘటనము జరుగు చున్నది. ఆధ్యాత్మిక శక్తియే బాహ్యబలమును తుచ్ఛముచేసివైచి ఈ జగము భగవంతుని రాజ్యమనియు అందమైన స్థూలప్రకృతియొక్క లీలాక్షేత్రము కాదనియు మానవజాతికి తెలుపుచున్నది" అని మనము గ్రహింపగలము. విశుద్ధమైన ఆత్మయే శక్తియొక్క ఉత్పుకము. ఏ ఆద్యప్రకృతి గగనమందు కోటానుకోట్ల సూర్యులను గిరగిర త్రిప్పుచున్నదో, అంగుళిస్పర్శ మాత్ర ముచే పృధ్వివిని నల్లల్లాడించి మానవసృష్టమైన సౌభాగ్యమును సకలమును చిహ్నంలేకుండ ధ్వంసమొనర్పగలదో, ఆ ఆద్యప్రకృతి విశుద్ధమైన ఆత్మ కధీనము ఆ ప్రకృతి అసాధ్యమును సాధ్య మొనరించును; మూగను మా టాడజేయును. కుంటికి కొండలుదాటగల సామర్థ్యము నిచ్చును. జగమం తయు ఆశక్తియొక్క సృష్టిఎవరియం దాధ్యాత్మిక బలము వికసించునో, వారికి జయ సామగ్రి సకలమును తనంతట తానే ఉత్పన్నమగును; అభ్యంతరము లును ఆటంకములును తమంతట తొలగి అనుకూలదశ చేకూరును; కార్య మును సాధించు దక్షత తనంతట ఉప్పతిలి తేజోవేగముల నలవరించు కొనును. యూరోపు నేడీ "Soul force" ను లేక ఆధ్యాత్మికశక్తిని తెలిసి కొన తడమాడుచున్నది: ఇంకను దానియందు సంపూర్ణ విశ్వాసము కుదర లేదు; దాని నాధారము చేసికొని కార్యము నాచరించు ప్రవృత్తి ఉద్భవించ లేదు. కాని భారత శిక్షణ, సభ్యత, గౌరవము, బలము, మహత్త్వము, ఈ అన్నిటికిని మూలము ఆధ్యాత్మికశక్తి. ఎన్ని మారులు భారత జాతియొక్క పతనకాల మాసన్నమైనటుల తోచుస్థితి ఏర్పడినను, అన్నిమారులును ఆధ్యా త్మిక బలము; తను దాగియున్న స్వస్థానమునుండి తీవ్రస్రవంతిగ ప్రవ హించి, ముమూర్షువైన భారతమును పునరుజ్జీంవిప జేసెను, ఆవశ్యకమైన సకలశక్తులను సృష్టించి యిచ్చెను. ఇప్పుడును ఆ ఉత్తమస్థానము వట్టిపో లేదు. నేడును మృత్యుంజయమైన ఆశక్తి యొక్క అద్భుతక్రీడ విలసిల్లు చున్నది.

# యోగశక్తి - ఆధ్యాత్మిక బలము

మహాపురుషుల తపస్సు, స్వార్థత్యాగుల కష్టస్వీకారము, సాహస వంతుల ఆత్మవిసర్జనము, యోగుల యోగశక్తి, జ్ఞానుల జ్ఞానసంచారము, సాధువుల విశుద్ధి ఇవన్నియు ఆధ్యాత్మిక బలమునకు జన్మస్థానములు. ఒక మారీ సకలవిధమైన పుణ్యబలము భారతమును సంజీవినీ సుధయందు ముంచియెత్తి మృతజాతిని సజీవమును బలిష్ఠమును తేజోవంతమును జేసి ఉద్ధరించెను. తనయందు తానింతవనుక నిరుద్ధమయి యున్న ఆ తపోబలము మరల అదమ్యము నజేయమునై బయల్పడుట కుపక్రమించుచున్నది. కొన్ని సంవత్సరముల పీడనము, దౌర్బల్యము, పరాజయము వీని ఫలితముగా భారతీయులు తమ అంతరమందే శక్తియొక్క ఉత్సము నన్వేషించుటకు నేర్చుకొనుచున్నారు. ఈ శక్తి ఉపన్యాసములవలన కలుగు ఉత్తేజము కాదు, మ్లేచ్ఛులిచ్చిన విద్యకాదు. సభాసమితులయందు ఆవేశమును సంచలింప జేయు శక్తికాదు. వార్తాపత్రికల క్షణిక ప్రేరణ కాదు. తమ అంతరమున, ఆత్మయొక్క విశాలనీరవతయందు, భగవంతుని యొక్కయు జీవుని యొక్కయు సంయోగముచే ఏ శక్తి, గంభీరము, అవిచాల్యము, అభ్రాంతము, విశుద్ధము, సుఖదుఃఖముల జయించినట్టిది పాపపుణ్యముల నతిక్రమించునట్టిది ఆవిర్భూతమగునో; ఏది మహాసృష్టికారిణి, మహాప్రళయంకరి, మహాస్థితిశాలినియో; మరి ఏది జ్ఞానదాయినియగు మహాసరస్వతియో, ఐశ్వర్యదాయిని యగు మహాలక్ష్మియో, శక్తిదాయిని యగు మహాకాళియో, తేజఃసహస్రముల ఏకరాశియైన ఆ చండి తానావిర్భవించి భారతావని యొక్కయు, భూమియొక్కయు, కళ్యాణమునకై పూనగలదు. భారతదేశముయొక్క స్వాతంత్ర్యము గౌణోద్దేశ్యము మాత్రమే; ముఖ్యోద్దేశము భారతీయ సభ్యతయొక్క శక్తిని ప్రదర్శించుట, జగమం

దంతటను ఆసభ్యతను విస్తరింపజేసి ఉచ్చపదవియందు నెలకొల్పుట. మనము పాశ్చాత్య సభ్యతయొక్క బలముచేగాని, సభాసమితుల యొక్క బలముచేగాని, ఉపన్యాసముల తీవ్రతచే లేక బాహుబలముచే గాని స్వాతంత్ర్యమునో లేక స్వాయత్తశాసనమునో ఆర్జింపగల్గి యుంటిమేని. ఆ ముఖ్యోద్దేశ్యము సాధింపబడజాలదు. భారతీయ విజ్ఞానముయొక్క బలముచే, ఆధ్యాత్మిక శక్తివలన సృజింపబడిన సూక్ష్మ స్థూలోపాయములచే స్వాతంత్ర్యము నార్జింపవలసియున్నది. కావుననే భగవంతుడు పాశ్చాత్య భావముచే ప్రేరితమైన మన ఆందోళనమును ధ్వంసముచేసి, బహిర్ముఖమైన శక్తిని అంతర్ముఖము కావించినాడు. బ్రహ్మబంధోపాధ్యాయుడు దివ్యచక్షువుతో దేనిని చూచెనో, చూచి "శక్తి నంతర్ముఖముచేయుడు" అని మాటిమాటికిని ఏ ఆదేశమును పల్కెనో, పల్కినప్పటికిని దేనిని కాల దుష్ప్రభావముచే ఎవరును శిరసా వహింపలేక పోయిరో, మరియు తానే చేయలేకపోయెనో, దానినే భగవంతుడు నేడుఘటింపజేయనున్నాడు.

## నూతన వికాసము-శ్రీ అరవిందుల రాజకీయ సందేశము

ఏకాంతకారాగారవాసమున తీవ్రముగా నొనర్చిన యోగానుభవముతో ఆధ్యాత్మికదృష్టితో ఆనాటి పరిస్థితుల కనుగుణముగా శ్రీ అరవిందులు సమన్వయించి ప్రబోధ మొనర్చుచుండిరి. ఈ నూతన ప్రబోధముతో జీవచ్ఛవమై యుండిన జాతీయపక్షమున గొంత చైతన్యము కలుగసాగెను. భగవానునిపై విశ్వాసముంచి ధైర్యమూని ప్రజలన్నిమండలములందును సభలుచేసి పూర్ణహృదయముతో, జాతీయభావములను వెల్లడింప మొదలిడిరి. ఈ నూతన వికాసము వలన, నవోజ్జ్వలనము వలన ఆంగ్లో ఇండియన్ పత్రికలకు

పోలీసధికారులకు కన్నుగుట్టినది. ఏడాది ఏకాంత కారాగారవాసానుభవ ఫలి
ముగా శ్రీ అరవిందులు రాజకీయములను త్యజించి, యోగిగానో సన్యాసిగానో
ఏ హిమాలయకాంతార గుహాంతరములందో ఏకాంతముగా నిరుపద్రవముగ
జీవిత శేషమును గడద్రోయునని యూహించిన పోలీసువారికి; ద్విగుణీకృతోత్సా
హముతో కర్మయోగియై యనుదినము బహిరంగోపన్యాసము లొసంగుచు
ప్రభుత్వ విధానముల ఖండించుచు పత్రికలలో విమర్శించుచు రాజకీయరంగ
మున నాయకుడై జాతీయపక్షమును బునరుద్ధరించుట నిజముగా హృదయ
శల్యమైనది. కాన వేగులవోరు తీవ్రమై యెట్లయిన శ్రీవారిని మరల కారా
గారమున బంధించుటకు విశ్వప్రయత్నము లారంభమైనట్లు గట్టిపుకారులు
బయలుదేరెను. అప్పటికి కారాగారమునుండి విడుదలయైవచ్చి మూడు మాస
ములు గూడ గాలేదు. కర్మయోగి పత్రిక ఐదవసంచిక మాత్రమే వెలుబడిన
సమీప కాలమది. అపుడే యుత్తరక్షణమున తన కేమి సంభవించునో యని
యనుమానించి శ్రీ అరవిందులు తమ కట్టకడపటి రాజకీయ సందేశము—
విల్—గా 'నాదేశీయుల కొక బహిరంగలేఖ' అను శీర్షిక క్రింద నొక యపూర్వ
పత్రమును 1909 సం॥ జూలై 19వ తేది ప్రకటించిరి. ఈ లేఖ యందలి
ప్రధాన విషయములను — సూరతు కాంగ్రెస్సు విధ్వంసము, దాని పునరుద్ధ
రణమును గురించిన భాగమును మాత్రము విడిచిపెట్టి — మూలమునకు
భంగము కలుగకుండ సంగ్రహముగా ననువదించి యీ క్రింద బొందుపరచు
చున్నాము.

"నన్ను ప్రవాసశిక్ష పాల్సేయవలయునని కలకత్తా పోలీసువారు ప్రభు
త్వమునకు వ్రాసియున్నారను వదంతి గట్టిగా నున్నది. అందువలన నాదేశీ
యులకు, ముఖ్యముగా జాతీయపక్ష సిద్ధాంతముల నంగీకరించువారికి, ప్రస్తు
తావసరముల గురించి భావి పద్ధతులను గురించి కొంత తెలుపుచు ఈ యుత్తర

మును ప్రకటించుట మంచిదని తోచినది. నేను ప్రవాసశిక్ష కంటపడినయెడల తమ భావికర్తవ్యమార్గము నెరుంగజాలనివారి కిది కొంత సాయపడగలదు. నే నిక ఆ శిక్షనుండి బయటపడి రాలేకపోయినయెడల నా తుది రాజకీయ సందేశము—విల్—గా నా దేశీయుల కీ యుత్తర ముపకరించ గలదు.

జాతీయవాదులస్థితి కష్టముగా నున్నను వారు ఆశాభంగము నంద రాదు. ఆ పక్షనాయకులు శిక్షింపబడినందున జాతీయపక్షము నశించినదని కొందరు తలంచుట పొరపాటు నేడును జాతీయపక్షము బలవత్తరముగా విస్తరించియే యున్నది. కాని మార్గము తెలియకను నాయకుడు లేకను మరు గుపడి యున్నది. మార్గమునెట్లో మనము కనుగొనవచ్చును. కాని నాయకుని మాత్రము భగవానుడే ప్రసాదించ వలయును. మహోద్యమములన్నియు భగ వచ్ఛక్తితో భగవానుడనుగ్రహించు నాయకునికై వేచియుండును.

మన యాదర్శము స్వరాజ్యము, విదేశీయాధికారములేని సంపూర్ణ స్వాతంత్ర్యము. తన స్వభావాదర్శముల ననుసరించి తన స్వశక్తులవలన తన స్వజీవనమును సృష్టించుటకు ప్రతిజాతికిని హక్కుగలదని మేము వాదించె దము. మన జన్మహక్కులనుండి మనలను దూరీకృతుల నొనర్చుటకుగాని మనకంటె నికృష్టమైన వారి సభ్యతను మనపై బలవంతముగా జొప్పించుటకు గాని వారికి హక్కుగలదని మే మంగీకరించము. చిరకాల దాస్యమువలన లోపములు కళంకములు మనకెన్ని యలవడినను పూర్వప్రభ, శక్తిసామర్థ్య ములు మనయందు తిరిగి మొలకెత్తుచున్నవని మే మెరుంగుదుము. మన తండ్రి తాతలకంటె మన మేమాత్రమును దీసిపోము. మేధాశక్తి కావలసి నంతయున్నది. ఎంతో ధైర్యసాహసములున్నవి. మనకెంతో అనంతమైన నానావిధమైన జాతీయపటిమగలదు. మనకు కావలసినదంతయు కార్యరంగము

నవకాశము. ఈ రెండును జాతీయప్రభుత్వమువలన, స్వతంత్ర సంఘము వలన, మహోత్తరమైన హైందవ సభ్యతవలన మాత్రమే లభించగలవు. వానిని మనకు లభింపజేయనంతకాలము వానిని సంపాదించుటకే మన మేధాశక్తిని ధైర్యమును, సామర్థ్యమును వినియోగించవలయునుగాని మరొక ప్రయోజనమునకు నుపయోగించరాదు.

## పరిణామ మందలి సత్యము

ఆత్మయే సచ్చిదానందము. దానికిని ప్రపంచమునకును మానరాని విరోధము కనుపించదు. ప్రపంచమును అజ్ఞాన దృష్టితో జూచుచున్నాము. జ్ఞాన దృష్టితో చూడవలెను. భౌతికజడతయందు లీనమై పూర్ణచైతన్యమునుగాంచ వృద్ధిజెందుచున్న జ్ఞానమే మన యజ్ఞానము. ఆ పరివర్తనమును బూర్తిచేసి మానవలోకమున నధ్యాత్మ జీవనమును వికసింపజేయుటకే పునర్జన్మ పరంపరలు అవకాశములుగ నేర్పడినవి. పరిణామమందలి సత్యమును మే మామోదించుచున్నాము. పాశ్చాత్యులచే దాని కొసంగబడిన స్థూలరూపమున గ్రహించుటలేదు. ప్రాణము, మనస్సు, ఆత్మ, ఇచ్చట భౌతికములో విలీనమైయుండి క్రమముగ వ్యక్తమగుచున్నవను తత్త్వ నిరూపణమునే గైకొనుచున్నాము. ఈ పరిణామముయొక్క శిఖరమున నధ్యాత్మ జీవనమును దివ్య జీవనమును గలవు.

## వేదము_ఉపనిషత్తుల-గీతా సత్యములు

ఈ సత్యములు పూర్వ వేదాంతమునకు భిన్నములు కావని నిరూపించవలసివచ్చినది. కావున వేదమును, రెండుపనిషత్తులను, గీతను ఈ దృష్టితో

బరిశీలించితిమి. వేదరహస్యము కర్మఠులచేతను పండితులచేతను మరుగు పఱుపబడినది. కావున వేదఋషుల రచనాశైలియు వారి సాంకేతికమును అవి తెలియజేయు సత్యములను కొన్ని వ్యాసములలో సూచనగా మాత్రమే నిర్దేశించితిమి. ఉపనిషత్తులలో ఈశ కేనలను గైకొంటిమి. పూర్తి చేయవలయునన్న తైత్తిరీయముగూడ చేర్చవలసియుండెను. కాని అది పెద్దదైనందున గ్రంథవిస్తరభీతిచే వదలితిమి. జీవనతత్త్వము యొక్క అతివిశాలము కాతిన్యాంశము నగు కర్మాచరణమున ఆత్మసత్యము నేరీతిననుసంధించవలసినది. కర్మ ఏ తీరున నధ్యాత్మజన్మను బడయునది. ఆధ్యాత్మ జీవనముతోడి దానినెట్లు సమరసము జేయవలసినది గీతనుండి ప్రతిపాదించుచున్నాము. తత్త్వవిచార మాచరణలో నుంచినగాని సార్థకము గాకుండుటచే 'యోగసమన్వయము' న పలుతెరంగులగు నధ్యాత్మశిక్షణల మూలతత్త్వములను మార్గములను పరిశోధించి దివ్యజీవనమునకు అవి ఎట్లు సహకారులగునదియు జూపించితిమి.

## —భాగవత జీవన రహస్య ప్రకటన—

........అను దినము యోగాభ్యాసము చేయునపుడు గుర్తించి తెలిసికొనిన దానినంతను బుద్ధిగ్రాహ్యముగా వ్రాయుట సంభవించినది. అది తనంత తానే తత్త్వశాస్త్రమైనది. శ్రీ అరవిందులు మత, రాజకీయ, సాంఘిక, సారస్వతాది కళా విశేషముల నన్నింటిని ఆధ్యాత్మిక దృష్టితో సమన్వయ మొనరించి వాని యన్యోన్య సంబంధమును పరమార్థమును వెల్లడించియున్నారు సుప్రసిద్ధ పాశ్చాత్య కవిశేఖరులగు షేక్సపియర్, మిల్టన్, వర్డ్సువర్తు, షెల్లి కీట్సు మున్నగు ప్రాచీనులయొక్కయు బర్నార్డుషా, వేల్సు, రసల్ (ఎ.ఇ.) మున్నగు యాధునికుల యొక్కయు కావ్యముల నన్నింటిని ఆమూలాగ్రముగ

విమర్శించి అంతర్ముఖ దృష్టితో కావ్యప్రపంచమున వారివారి యథాస్థాన మిది యని సోదాహరణముగ శ్రీఅరవిందులు నిర్ణయించిన విషయము వారు రచించిన 'భావి కవిత్వము'ను. దిలీపుకుమారరాయ్‌కృత "అనామి" అను బెంగాలీ గ్రంథములో ప్రకటితములైన వారి లేఖలను బఠించినవారికి స్పష్టము కాగలదు. వారి యాంగ్లరచనా నైపుణ్యమసామాన్యము. అందు మహత్తరమైన ఆధ్యాత్మిక భావముల పరిమళము గుబాళించుచుండును. క్రొంగ్రొత్త శయ్యాపాకములు, విశిష్టము నసాధారణము నగు భావార్థముల నీను నూతన పదజాలములు, శోకడలు గలవు. ఇట్లతీత విజ్ఞాన విభూషణములతో శ్రీఅరవిందు లాంగ్లభాషాకన్యను సర్వశోభాలంకృతం గావించి భాషాప్రపంచము నందగ్రపీఠమున కెక్కించిరి. ఆత్మానుభవము లేక కేవలము హేతువాదమునకు తర్కమునకు బుద్ధిసూక్ష్మతకు ప్రత్యక్ష భౌతికశాస్త్ర పరిశోధనా పరీక్షలకును ప్రాముఖ్య మొసంగుటయేకాక ఆద్యంతము లివియే యను పాశ్చాత్య లోకమునకు యోగాభ్యాస పూర్వకానుభవములను, వేదకాలపు సిద్ధాంతములను, తత్త్వసూత్రములను, పరమధర్మములను, సత్యములను, పరమార్థమగు భాగవత జీవన రహస్యమును సహేతుకముగ సప్రమాణముగ శాస్త్రీయముగ సర్వతోముఖముగ వెల్లడించి ప్రాచ్య పాశ్చాత్య సభ్యతా సంకలనము గావించి ప్రపంచకళ్యాణ మొనర్చుట భగవానుని సంకల్పమే యని శ్రీఅరవిందుల నిరుపమానాంగ్ల రచనావైభవము స్ఫురింపజేయుచున్నది.

# ఆదర్శ భారత యువకులు :

భారతయువకులనే మేము సంబోధించుచున్నాము. యువకులే— నిర్మలమైన మనస్సు, నిర్మలమైన హృదయము గలవారు. పూర్ణసత్యమును అంగీకరించువారు, గొప్ప ఆదర్శములకొఱకు కృషిచేయువారును అగు యువకులే— నూతన ప్రపంచమును నిర్మింపగలరు..........వారు గతమునకో లేదా ప్రస్తుతమునకో గాక భవిష్యత్తునకై తమను తాము అర్పించుకొనగల మానవులై యుండవలయును. మరియు వారు స్వార్థత్యాగులై, వారియందునను సర్వ మానవులందునను దైవసాక్షాత్కారమును పొందుటకు, దేశమునకు మానవజాతికి మనోవాక్కాయకర్మల, అలసటయనునది లేక కృషిచేయుటకు సిద్ధమైయుండవలయును. ఈ ఆదర్శము యిప్పుడు బీజరూపమున మాత్రమే యున్నది. దీనికి ఆకారమునిచ్చెడి జీవితముకూడ చిన్న కేంద్రస్థానమై యున్నది. అయినను యీబీజము మహావృక్షము కాగలదని మా దృఢ నమ్మకము. ఈ కేంద్రస్థానము నిరంతర వ్యాప్తికి రూపమునీయగల హృదయభాగము కాగలదు. ఆత్మశక్తియందలి మాకుగల దృఢమైన నమ్మకమే—యీ ప్రపంచముయొక్క అవ్యక్తస్థితులకు, భ్రమలకు మధ్య ఒక నూతన మానవజాతి ఉత్పన్నమగుటకు పోరాడుచున్నది. ఆ ఉత్పన్నమగు నూతన జాతి యందునను మరియు భవిష్యత్భారత దేశమునకు ధ్వజధరులగు వారిలో మాస్థానమును మేము ఆక్రమించుకొనుటకు మమ్ము పేరేపించుచున్నది. అట్లు పునర్జన్మను పొందిన అఖండభారతదేశము ప్రతిభావంతమై— ప్రస్తుతము బలహీనముగనున్న మన సనాతన భారతమాత దేహమును మరల దేదీప్యమానముగ ప్రకాశింపజేయవలసియున్నది.

❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖



శ్రీ అరవిందులకు మన హృదయపూర్వక
కృతజ్ఞతలు తెలుపుట యన —

వారి పరమ లక్ష్యమైన దివ్యజీవిత విధానమునకు ప్రత్యక్ష
నిదర్శనముగా నుండునట్లు మన జీవితమును
రూపొందించుటకన్న ఉత్తమమైన
మార్గము మరొకటి లేదు.

— శ్రీ మాత

❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖



*The whole world in steeped in false - hood so all actions that arise will be false and this situation may Continue for a long time and will bring much suffering to the people and the country.*

*The only thing to do is to pray from the heart for Divine intervention as that is the only thing that can save us. And all people who can become conscious of this must decide very firmly to stand only in the truth. There should be no compromise. This is very essential. It is the only way.*

*Even if things seems to go wrong and badly for us, as indeed they will because of the present prevailing false - hood we should not be deterred from our own determination to s:and on the truth.*

*THE MOTHER.*